# కృతజ్ఞత

P & T. కల్చరల్ ఫెస్టివల్, విజయవాడ — నవంబరు. 1960

ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్.

కల్చరల్ ఫెస్టివల్, హైదరాబాద్ — డిశంబరు, 1960

నాటకపరిషత్తు తాడేపల్లిగూడెం తాపేశ్వరం — మార్చి, 1961

I. L. T. D. ఇంటర్ డిపార్టుమెంటల్

డ్రామా కాంపిటీషన్సు, అనపర్తి — మే, 1961

మొదలైన అఖిలాంధ్ర నాటకోత్సవాలలో ప్రదర్శనకూ, నటనకూ వివిధ బహుమతులను అందుకోగలిగినఉత్తమ స్థాయిలో ప్రదర్శన లిచ్చిన

టెలిఫోన్ ఎక్స్చేంజి, విజయవాడ

ఇండస్ట్రీస్ డిపార్టుమెంట్ డ్రమెటిక్

ఎసోసియేషన్, హైదరాబాద్

I. L. T. D. డ్రమెటిక్ ఎసోసియేషన్, అనపర్తి

వారికి

నా హృదయపూర్వకమైన

అభివందనాలు.

---

# భజంత్రీలు



[25—2—1950 తేదీని రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో శ్రీ జయంతి గంగన్న పంతులుగారి అధ్యక్షత క్రిందజరిగినపూర్వ విద్యార్థి వార్షికోత్సవసందర్భంలో ఇది మొదటిసారిప్రదర్శింపబడింది.]

## పాత్రధారులు

| | | |
|---|---|---|
| గండభేరుండం | : | శ్రీ భమిడిపాటి రాధాక్రిష్ణ. |
| జ్యోతి | : | పి. ఆదినారాయణరావు. |
| చెవలయ్య | : | యమ్. పి. ఎస్. రాజ్ పాయ్. |
| రామం | : | సి. హెచ్. బ్రహ్మాజీరావు. |
| జలపాతం | : | డాక్టరు పాలకోడేటి రామమోహన రావు. (రాంబాబు) |



# పాత్రలు

గండభేరుండం : ధనికుడైన పరమలోభి.

జ్యోతి : గండభేరుండానికి ఏకైకపుత్రుడు.

చపలయ్య : వాళ్ళకి నౌకరు. నక్క జాతి.

రామం : జ్యోతి వరించిన లతకి అన్న-జ్యోతికి స్నేహితుడు.

జలపాతం : మగపెళ్ళికూతురుతండ్రి. సరుకు తక్కువయినా, హోరుఎక్కువ.

—o—

# భజంత్రీలు

---

## మొదటిరంగం

[తెర ఎత్తగానే పెద్దహాలు, రెండు, మూడు కుర్చీలు, రెండు బల్లలూ ఉంటాయి జ్యోతి, గండభేరుండం చెరో బల్లదగ్గిరా పెడ ముఖాల్తో నుంచుంటారు గండభేరుండం మెల్లిగా వెనక్కి తిరిగి, దురుసుగా చూస్తూ, బిరుసుగా కర్ర ఝాడించుకుంటూ పచార్లు ప్రారంభిస్తాడు]

జ్యోతి : అసలు నా ఉద్దేశం ఏమిటంటే, నానా

గండ : (ఆగి కోపంగా) ముందర నువ్వు నోరు లక్కపిడతలా నొక్కేసుగుని వాగుడు కట్టెయ్యి (కాస్సేపు నిదానించి) లేకపోతేనూ! అసలు నాకు చిర్రెత్తుగొచ్చిందంటే "నీకూ నాకూ చెల్లు ఫో!" అనేసి నిన్నుత్త బేవారసుకుంక కింద చేసెయ్యగల్ను తెలుసా? లేకపోతే ఏమిటండీ! వీడి పెళ్ళి వీడిష్టంట! బోడిష్టం వీపూను, నిశ్శేంపలాంటి జలపాతంగారి అమ్మాయిని చేసుగోరా, అంటే-

జ్యోతి : నాకిష్టంలేదు, నాన్నా!

గండ : అదుగో, ఆ చపటన్నర కూతలే మరి కుయ్యొద్దన్నాను (హేళనగా, చేతులాడిస్తూ) ఇష్టం లేదట! ఇష్టా ఇష్టాలకి ఇదేమన్నా మిఠాయీ, మైసూరుపాకమా!

జ్యోతి : (విసుగ్గా) అది కాదు, నాన్నా!

గండ : (హేళనగా) ఏదిగాదు, కుమారా!

జ్యోతి : (నిరాశతో నిట్టూర్చి, కొంచం కోపంగా) నేనా అమ్మాయిని అసలు చూళ్ళేదు.

Kండ : చూళ్ళే ? (ఆలోచించి, గ్రహించినట్లు నవ్వి, తల ఊపుతూ) అదిట్రా పిచ్చికుంక్రడి ! మరల్లా చెప్పి యిదవ్వేం, ఇందాకణ్ణుంచీను, హారి! కాస్సేపున్నాక వెళ్ళి చూసి చక్కా రావోయ్, కావలిస్తే నేనూ వస్తానూ.

జ్యోతి: నన్ను మీరు అర్థంచేసుగోటం లేదు, నాన్నా ! నే నసలు ఆ అమ్మాయిని ప్రేమించటం లేదు.

Kండ : ప్రేమేమిటిరా, నీతలకాయి

జ్యోతి: (అర్థం చెప్పడానికి ప్రయత్నించినట్లు చేతులుజాపి) ప్రేమ-నాన్నా ! ప్రేమంటే-అదే- (కవిత్వ ధోరణిలో) రెండు హృదయస్పందనాల శాశ్వత కలయిక !

Kండ : ఏడిశావు నోర్మయ్యవోయి ! వెధవ వేలెడంత లేడు ప్రేమట ! హృదయాల్ట ! స్పదనాల్ట !

జ్యోతి: (నిశ్చింగా) నేనామ్మాయిని ప్రేమించ లేను

Kండ : ప్రేమించ లేవ్రా ? ఏం రోగం నీకు ?

జ్యోతి: నేను మరోఅమ్మాయిని ప్రేమించాను.

Kండ (ఆశ్చర్యంతో. నోరు తేలేసి) ఆ! మరో అమ్మాయా ! కోపంగా, సూటిగా చూస్తూ) ఆ చవటెవరు ?

జ్యోతి: మనరామం చెల్లెలు లత, నేనామ్మాయినే పెళ్ళాడ తాను.

గండ: (కోపంగా కర్ర జాడించి, తిరుగుతూ) ఆడతాట్ట, ఏమిటో ఆట ! ఓ రేయి, అబ్బీ ? ఇప్పుడే చెబుతున్నాను, విను, లత నా కోడలు చస్తే అవదు. లతట, లత-పీత వాలకం అదీను. దానికి అరామం గాడికి కలిపి చిన్నమొత్తు బుర్ర లేదాయిరి, సెటు భూమి లేదాయిరి, కానీ పలుకుబడి లేదాయిరి, వీళ్ళా నీకు దొరుకుత ? ఈ కాలపు కుర్రకుంకలకి స్వేచ్ఛ అంటూ ఇస్తే ఇవీ వీళ్ళ వైత్యపు పిచ్చిఘోరణాలు. బిళ్ళకుడుముల్లాంటివి పదివేల రూపాయిలు బంగారపు పోతవిగ్రహం లాంటి పిల్లనీ కలిపి మనింట్లో పడేస్తానని ఆ జలపాతంగారు నెల్లాళ్ళ నుంచి మనింటిచుట్టూ తిరుగుతూవుంటే ! (అభినయిస్తూ) 'శోలీకిమ్మత్తు చెయ్యకపోయినా సరే లతనే చేళ్ళాడతాను !' అందానికి కాస్త బుద్ధి ఉన్నవాడెవడికేనా నోరొస్తుందిరా ? నేనైతే ఈపాటికి ఎగిరిగంతేసి పెళ్ళిపీటెక్కి కూచోను, మరీ !

జ్యోతి: పోనీ కూర్చోండి, మరీ మంచిది !

గండ: ఏడిశావు లేవోయ్, ఏడిశావని ! మరీ మంచిదిట ఆకళాయి బుర్రలో రంపంపోట్లు, ఎందుకడ్డిలెప్పు ఏమన్నా ఉంటేగా అసలూ ! (కొంచెం కళ్ళుచికిలించి, దరమందహాసంతో) నా చిన్నతనంలో మా నాన్న నన్ను పిలిచి, 'ఒరేయి, గండభేరుండం ! ఆ విశ్వరూపంగారి అమ్మాయిని పెళ్ళిచేసుగోరా !'

అన్న తతుణం పరిగెత్తుకెళ్ళి మీా అమ్మమెళ్ళో పుస్తి గట్టి చక్కా వచ్చానుగాని, ఇలాంటి పనికిరాని పొగరు మోతు సమాధానాలు చెప్పి ఎరుగుదునా, మరీ !

జ్యోతి: మీారు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి, నామనస్సు మారదు.

కండ : (పిచ్చికోపంతో) ఉహూ ! నేనూ నీలాగే రాలు గాయి పట్టుపట్టి కూచుని మీాఅమ్మని భ ర్తె చేసుగోకుండా ఉండవలసింది. అప్పుడు నీ రోగం, నీ ఎగుర్లు, నీవేషాలు చప్పగా కుదిరేవి! ఒరేయి, నాకు ఒళ్ళు మండుకోస్తోంది. కోప మొస్తే అమాంతం ఖడ్గమృగా నయి పోతాను. తెలుసా ?(తాపీగా) ఈ ఘటంలో ఇంకా పులుపు చావలేదు- మారె ! ఏమనుకుంటు న్నావో, గాని.

జ్యోతి: అయినా సరేనండి.

కండ : ఇంక నీకు, నాకూ చెల్లు పో, అనేస్తాను, కాస్తో!

జ్యోతి: ఫరవాలేదండి !

కండ :(భయంకరంగా మొహంపెట్టి) తండ్రిని తిరస్కరించిన ద్రోహి, అనుగో అని నిన్ను చూపెట్టి అంతా మొహా మీాద ఉమ్మేస్తారు-ఆ !

జ్యోతి : నాకు లక్ష్యంలేదండి !

కండ: (తనలో) మొండిపీనుగు ! వెధవ పోలికలుతా పీడూను నేనూ ఇంతేట చిన్నప్పుడు, మరి ! (పైకి రాజీపద్ధతిలో) ఓరేయి, జ్యోతీ ! అసలు నీకు పట్టుదలగాని

నువ్వొగనుక ఆ జలపాతం కూతుర్ని చూస్తే ఇల్లా పేల్తావురా, మరీ! ఆ సౌందర్యరాశి ఇలాతిరగ్గానే మనం ఉత్తసేమియా అయిపోయి ఆ లేడిచూపుల వేడి ప్రవాహంలో ఢొల్లిబుచ్చికాయిల్లాగ కొట్టుగుపోడం తప్ప ఏం చెయ్యలేమంటే, కొలుచుగోమరి, ఆవిడ అందపరిమాణాల మందం!

జోృతి: (ఆముదం తాగినట్లు మొహంపెట్టి) అంత అసహ్యంగా ఉందిగావును. పాపం అజలపాతం కూతురు!

గండ: ఆ! హోరి! ఇంత చచ్చుగచ్చకాయబుర్ర అయిపోయిందేరా నీది! ఇందాకణ్ణుంచే చెప్పిందానివల్ల ఇదా గ్రహించింది. నువ్వు? జలపాతంగారికి నేరాసిన ఉత్తరం ఇవ్వడానికి వెళ్ళి మన చెవలయ్య కూడా చూసొచ్చాడు. ఆఅమ్మాయిని! వాడిచేత చెప్పిస్తాను చూడు, ఆ జలపాతం కూతురు అందం ఎంతఘాటుయిందో! చెవలయ్యా! (విసుగ్గా) చెవలయ్యా! (పళ్ళుబిగపెట్టి కోపంగా) ఒరేయి, చెవలయ్యా!—

చెవ: (తాపీగా ప్రవేశిస్తూ) అయ!—

గండ: వెధవయ్య!— పిలుపుకేనా అందకుండా ఎక్కడ తగులడ్డావురా?

చెవ: (హడావుడిగా) అబ్బాయిగారు లతమ్మగారికిమ్మని-

గండ: ఏమిటేమిటీ!

చెవ: (నాలికొరుక్కుని, నవ్వు లాగితెచ్చుకొని), ఏమీ ఇవ్వలేదండి!-

గండ : సమాధానం యథా ప్రకారం ఏడిసినట్లుంది. అసలు నువ్వెక్కడికి పోతా ?-

చెవ : ప్రక్క వీధిలో జనం దెబ్బలాడుకుంటూంటే చూడ్డాని కెళ్ళానండి.

గండ : హోరి, టోపీదాసూ !— ఉత్తరం ఇవ్వడానికి వెళ్ళి నపుడు ఆ అమ్మాయిని చూసొచ్చావా ?

చెవ : (తనలో) ఉత్తరం నేపట్టిగెళ్ళి లతమ్మగారి కిచ్చినట్లు ఈ ముసిలాయినకు తెలిసిపోయిందిరా, దేవుడా ! ఇంక కొంపలు తగులడ్డమే తరవాయిగావును.

గండ: (విసుగ్గా) అల్లా బెల్లం కొట్టినరాయిలా నుంచుంటా వేరా, మైలురాయిపీనుగ ! ఆ అమ్మాయితో మాట్లాడావా, అసలు ?

చెవ : (అనుమానంగా) అయితే అబ్బాయిగారు మీదగ్గర నిజం ఒప్పేసుకున్నా రన్నమాట. (గండభేరుండం అడుగుతున్నది తను, లతకి రాసిన ఉత్తరంగురించి కాదని, అయన జలపాతానికిరాసిన ఉత్తరం గురించి అని జ్యోతి సజ్ఞలతో రహస్యంగా చెవలయ్యకి తెలియబరుస్తోంటే సగంలో గండభేరుండం జ్యోతిని చూస్తాడు)

జ్యోతి: (నవ్వడానికి ప్రయత్నిస్తూ, వేళ్ళు గాల్లోకి తిప్పి) గాలి హాయిగా ఉంది, నాన్నా !

గండ: ఏకిశావు కేవోయి ! అబద్ధాలు చెప్పమనా నువ్వు సజ్ఞలు చేస్తున్నది. (నిక్కచ్చిగా) ఒరేయి, చెవ

లయ్యో! అవకతవక సమాధానాలు చెప్పేవా, చంపే
స్తాను. (కోపంతో కళ్ళు మిటగరించి) అసలేగుండెలూ
భగభగ మండిపోతున్నాయి!

చెవ : (పరాగ్గా) అరెరే!- అల్లా ఎల్లా అంటుగున్నాయండీ,
పాపం!-

గండ : ఛప్, నోర్మూయి!- (పళ్లుబిగించి) నువ్వు ఇందాకా
ఉత్తరం ఇవ్వడానికి వెళ్ళి, ఆ అమ్మాయిని చూళ్ళే
దూగా!-

జ్యోతి: (కంగారుపడుతూ, తనలో) ఈ చెవలయ్యనారహాస్యం
కాస్తా అడగందే బయటపెట్టేలా ఉన్నాడు, ఏందారి?

చెవ : (సకిలించి) ఆ అమ్మాయి గారేనాండి,- (అనుమా
నంగా చూస్తూ. ఏడుస్తూనవ్వి) ఆ అమ్మాయి గారు-

గండ : ఊఁ, ఆ పెళ్ళికూతురేరా!-

చెవ : (తనలో) పెళ్ళికూతురంటూ లతమ్మగారిని వేళా
కోళం చేస్తున్నాడు, ముసిలాయన, ఆమ్మాయి
బాగుందంటే డొక్క చించేస్తాడు. ఎత్తులూ మనకి
తెలియవనే!- (గర్వంగానవ్వి, పైకి) పెళ్ళికూతురు
గారండీ!-

గండ : (మొహం చాటంత చేసుగుని నవ్వుతూ) ఊఁ!-

చెవ : చూస్తే డోకొస్తున్నారండి -

గండ: బకాసురుడిలా మొహం పెట్టి, చేతులో కర్ర బాణా
కర్రలా త్రిప్పుతూ, కోపంగా) కారిలుచ్చా!- నిన్ను
చంపేసినా పాపంలేదు!-

చెవ : (కొట్టినట్లు ఏడుస్తూ) బాబోయి, బాబోయి!- రక్తం! ప్రవాహం !- ఖూనీ !- హత్య !!-

కండ: (హడలిపోయి, తగ్గి) అల్లా చంపేసి ఏడుస్తావేరా, నక్కపీనుగ!- అసలు జలపాతంగారికి నేరాసిన ఉత్తరం ఇచ్చావా ?-

చెవ : మరండీ, ఆయన ఇంట్లో లేరండి !-

కండ: మరి, ఇందాకా ఉత్తరం ఇచ్చానన్నావు కదురా అబద్ధాలగుట్టా !

చెవ : ఉత్తరంమాత్రం ఇచ్చేశానండి. మొగంగులువీధులో కెళ్ళారంటే, ఆడంగులికి ఇచ్చానండి

కండ : చంపుతున్నావురా నన్ను. బీటముక్కిపీనుగ !అప్పాను జలపాతంకూతుర్ని చూశ్చేదురా, మరీ ?-

చెవ : చూశానుకదండి, మరీ !-

కండ : ఆ అమ్మాయి చాలా బాగుంది అని ఇందాకానాతో చెప్పావా నువ్వు ?-

చెవ : చెప్పానండి, చెప్పానండి !-

కండ: మరిప్పుడిల్లా పేల్తావేరా శనీ !-

చెవ : అల్లాయితే, ఉండండి, మరి !- (తనలో) అబ్బాయిగారు రాసిన ఉత్తరంగురించి కానేకాదు. ఈయన మొరుగుళ్ళు తప్పాదిమ్మా ! తను జలపాతానికి రాసిన ఉత్తంగురించా, (నవ్వుతూపైకి) ఇందాకా అవతల సందులో జరిగిన స్వల్ప ఘోరయుద్ధలో మనబుర్ర, ఒళ్లు యావత్తు పెట్టుబడి పెట్టెయ్యడం

వల్ల ఆల్లాకొంచెం తల్లకిందులుగా సమాధానాలు ఒచ్చాయండి !-

కండ: అయితే, ఇప్పుడు సరిగ్గా చెప్పు, ఆజలపాతంగారి ఏకైక పుత్రిక ఎల్లా ఉందిరా ?-

చెవ : (కళ్ళు చికిలించి, 32 పళ్ళు చూపెడుతూ) అచ్చు పంచదార చిలకల్లా ఉన్నారండి !-

కండ: (గేదెలా నవ్వుతూ) భేష్!- విన్నావురా జ్యోతీ!- చెవలయ్యా !- ఆవిడ కంఠం ఎల్లా ఉందిరా ? (జ్యోతి చెప్పొద్దని చెవలయ్యకి సంజ్ఞ చేసి కండ భేరుండానికి తెలియకుండా వీధులోకి చక్కాపోతాడు.)

చెవ : (అభినయిస్తూ) ఆర్మోణీలు వాయించి నట్లుందండి.

కండ: (మెచ్చుకుంటూ) ఉ, ఊ !- ఆవిడ మొహం ఎల్లా ఉందిరా ?-

చెవ : మొహమేనాండి, మొహం !- (ఆలోచించి) అచ్చు కోనసీమ కొబ్బరికాయలా ఉందండి.

కండ: అంతగుండ్రం అన్న మాట, పిచ్చికుంక ! చంద్రుళ్ళా ఉందనాలి, తెలిసిందా ?- ఊ ! ఆవిడ నడక ఎల్లా ఉందిరా ?- వినరా జ్యోతీ !- విను!-

చెవ : ఆవిడ నడుస్తుంటేనాండి?- మన జోడుగుర్రాల సార్టుబండి నడుస్తున్నట్లుందండి !-

కండ: ఇంక చాల్లే విన్నావా జ్యోతీ !-నీకు పిచ్చిగాని- (అని జ్యోతి ఉండినవైపు తిరిగి, జ్యోతికనపడక పోగా) ఏడిరా, వీడూ ?-

చెవ : అల్లా వీధులో కెళ్ళారండి !-

గండ: మరి నాతో ఎందుకు చెప్పలేదురా, నువ్వు ?-

చెవ : మీతో చెప్పమని వీరు నాతో చెప్పలేదు కదండీ, మరి !

గండ : (విసుగ్గా) ఏడిశావుగాని, నువ్వింట్లో నేవుండు. ఇప్పుడే వస్తాను. నా వెనకాల లేవెక్కడికేనా ఉడాయించావా... కాలు బొప్పాసిగొట్టంలా విరిచి అక్కడెడతాను తెలిసిందా ?— (చెవలయ్య బుర్ర ఊపుతాడు గండ భేరుండం కర్రపుచ్చుకుని విసురుగా వీధిలో కెడతాడు)

( తెర )



# రెండవరంగం

[రామం ఇంట్లో హాలుగది, రెండు. మూడు కుర్చీలుంటాయి ఒక డ్రాయరు. దానిమీద కొన్ని పుస్తకాలు ఉంటాయి)

రాము: (పుస్తకాలు పుచ్చుకొని ప్రవేశించి, అవతలవైపుకు నడిచి) లతా !- లతా !- (నిదానించి) కాలేజినించి ఇంకా రానట్లుంది...హుంష్ ! సరే... (అని తాపీగా పుస్తకాలు బల్లమీద పెడుతూ) అరే, ఇది జ్యోతి చెల్లాయికి రాసినఉత్తరంలావుందే. ఊఁ! ...(ఉత్తరం చదువుతూ) ప్రియమైనలతకి,పొద్దుట్నించి నన్నెల్లుకదల్నియ్యకుండా జీడిలాపట్టుకుని మా నాన్న నన్ను చంపుకుతినేస్తున్నాడు. అమహా భూతం జలపాతం కూతురు తాటకిని చేసుకోమంటాడు' (ఉత్తరం చదవడంఆపేసి) అరి, వీడి నోరడిపోనూ! చంపని తాటకి, అంటాడా ? వీడినాలిక తెంపి గాడిపొయ్యిలో పారేసినా పాపం లేదు ! మనం చంపని చిక్కగా ప్రేమిస్తున్నామని వీడికామాత్రం తెలియక్కర్లే ? ...ఫూల్ ! (మళ్ళీ చదువుతూ) నిన్ను తప్ప వేరొకర్ని తలపెట్టనని కచ్చితంగా చెప్పెయ్యదలుచుకున్నాను. అయనవినక పోతే, రామాన్ని తీసుగుని మనంఏవూరేనా చక్కా పోయి పెళ్ళి చేసేసుగుందాం.సాయంత్రంవచ్చి అన్ని విషయాలు మాట్లాడుతాను,జ్యోతి. ఉత్తరం మడిచి) ప్లాన్ బాగానే ఉందిగాని, ఇల్లా పెళ్లి చేసుగుందుకు లత ఒక్కనాటికీ ఒప్పుగోదు, పైగా ఆస్తిగల

అమ్మమ్మఉంది. ఉంటే ఏం ? దొంకమ్మ !—కాని రాల్చదు. నెలనెలా డబ్బు పంపడానికే వెళ్ళాడే బొమ్మలాగ గింజుకు ఛస్తోంది. ఎప్పుడు ఆవలిస్తుందో గాని-

జ్యోతి: (ప్రవేశిస్తూ) ఏరా, రామం ! ఎవరు పోయారు? మీ అమ్మమ్మే !-కొంగ్రాట్యులేషన్సు, ఊ!- ముందర ఒక కప్పు కాఫీ రానియ్యి, నాలిక పిడచగట్టి ఛస్తున్నాను.

రామం: (కోపంగాచూచి ఫ్లాస్కులో కాఫీ కప్పులోపోస్తూ) మాఅమ్మమ్మ ఛస్తే చావదు, నల్లరాయిలా ఉంది. అదిసరేగాని. నేను తమకోసం ఇందాకణ్ణించీ ఎదురు చూస్తున్నాను.

జ్యోతి: (కాఫీ గుటకాయుచుని) అల్లాగా !-

రామం: మీతాతలకాయ కొంచెము మరమ్మత్తు చెయ్యాలను కుంటున్నాను.

జ్యోతి: (కాఫీ కొంచెము తాగి) ఎందుకండీ. పాపం మీకా శ్రమ !

రామం: ఎందుకేమిటి, మీ శ్రార్ధం !- వెనవ ఉత్తరాలు నువ్వ్వేను, చంప తాటకా ?

జ్యోతి: ఏమో, నాకళ్ళకి అల్లాకనపడింది. నాకు చంపఅంటే చేదు. శోకు, వాంతి ! ఏం చెయ్యను ?

రామం : అల్లాగే వెనక్కి మింగేసి ఊరుకో, నాకు చంప అంటే తీపి, పోయి, స్వర్గం !-

జ్యోతి: ఎవడి రుచి వాడిది, పైగా ప్రేమ గుడ్డిది.

రామం : (చిరాకుతో) అయితే నే గుడ్డాణ్ణయి ప్రేమించా నంటావు ?

జ్యోతి: ఏమో, నాకేం తెలుసు ?

రామం: (కసిగా) చ ప నీగురించి ఏం చెప్పిందో తెలుసా ? నువ్వొత్త పిసతకి దసప్పు రకం అంది.

జ్యోతి: అయినా నాకెందు కబ్బాయి. ఇదిగో చంప, రంభ, ఇంకా కావలిస్తే రంభ బాబు ! చాలా రామం !- ఇంతకీ నాప్లాను సంగతి ఏం శేల్చారు ?

రామ : లత అల్లా చెయ్యడానికి ఒప్పుకోదురా.

జ్యోతి: (కుర్చీమీద-చతికిలబడుతూ) హు!- గొప్పచిక్కే వచ్చిందే. ఇప్పుడు మానాన్నని యద్వీథంగానైనా జోల్లాకొట్టించి లతతో నాపెళ్ళికి ఒప్పించా లన్న మాట (ఆలోచించి) పోనీ ఓపనిచే స్తే!- (ఇంకాఆలోచించి) అబ్బే, నాన్న పసిగట్టేసిస్తాడు. పైగా ఒళ్ళు చీరేస్తాడు కూడాను.

చెవ : అబ్బాయిగారు!- అబ్బాయిగారు !-

జ్యోతి: (హడావుడిగా లేచి) ఏమిట్రా!-నాన్న ఒస్తున్నాడా ?

రామం: అమ్మోయ్యో !- గండభేరుండమే.

చెవ : లేదు కానండీ, ఎంతపని జరిగిందో విన్నారా ?-)వీపు మీద దోమని ఒక్క-దెబ్బతో చంపి) అబ్బా- ఈ మధ్య దోమలు మహా ఎక్కు- వయ్యాయండోవ్!-

జ్యోతి: అసలు సంగతి ఏడవ్వా!-

చెవ : వస్తున్నానండి, బాబు, వస్తున్నా, (వచ్చిన దోమని చేత్తో తీసి పరీక్షించి) అసలు ఈ దోమల మకాం ఎక్కడో కనిపెట్టి, రహస్యంగా వెళ్ళి పీకలు పిసికి చంపేస్తే-

జ్యోతి: ఏం జరిగిందో తొన్నగా చెబుతావా, ముందర నీపీక నొక్కి చంపెయ్యనా ?-

చెవ : వద్దొండీ!-అదంపమ్మగారికీ మాహూ పెళ్ళి నిశ్చయంచేసి ముహూర్తం పెట్టేశారండి.

రామ : హరి, గుంటనక్కముసలీ !-

జ్యోతి : (తలగట్టుకుని) ఈ దిక్కుమాలిన చెంప !-

రామం: (కోపంగా) ఒరేయి, జ్యోతీ !

జ్యోతి : మర్చిపోయారా, బాబూ! ఈచెంప నాకొంప టూపు లేపేస్తోంది !-

రామం: నా చంపని తిట్టావా, మాటదక్కదు.

జ్యోతి: అల్లాగా, అయితే చంప నా బంగారు కొండ! అంత మంచిపిల్ల ఈ భూగోళంమీద ఎక్కడా లేదుస్మా డి ఏమనుకున్నారో, గాని ! అసలుచూస్తే ముద్దెట్టుగో బుద్ధి !

రామం: నీబుద్ధికి నిప్పెట్టి నీపెదిమలు చీరేస్తాను.

చెవ : (అభినయిస్తూ) ఇల్లా; తాటాకుముక్క చీరినట్లు, కదండీ !

జ్యోతి: అం చేత, పౌగ స్తకూడా నిషేధ అన్నమాట కొందరు మొగుడు కుంకలికి పెళ్ళాలమీద అసూయ బయల్దేరిందా, వాళ్లు బతక లేరు, పెళ్ళాల్ని బతకనియ్యరు, పైగా ఊళ్ళో వాళ్ళనికూడా, యథాశక్తి బతకవద్దని ప్రబోధిస్తారు !-

చెవ : అవునండి, అవునండి !-

రామం: ఒరేయి, చెవలయ్యా !- ఈసారి మళ్ళీ మధ్యలో జొరబడి వాగావా, చెవుల్తెంపి నీచేతిలో పెడతాను, తెలిసిందా ?- (చెవలయ్య రెండు చెవులూ మూసుకొని బుర్రఆడిస్తాడు)

జ్యోతి: (ఏదో ఆలోచన తట్టినట్లు నటించి ఉత్సాహంగా చిటికేసి) చెవలయ్యా ! ఇల్లారా,(వచ్చాక) ఉన్నపళంగా గొల్లుమని ఏడవగలవురా ?

చెవ : గొల్లేమిటండీ ! అసలు ఎవరైనా పోయినపుడు ఒక్కొక్కప్పుడు ఏడవడానికి జనం తక్కువౌతుంటారు చూడండి అప్పుడు మన్ని అనామతుగా పిలిపించి ఏడుపు పంక్తిలో కూచోపెడ్తుండే వారండి.

జ్యోతి: ఎవరు ?

చెవ : ఆచచ్చినాడి చుట్టాలండీ !

జ్యోతి: ఇంకనే, అదితిరుగులేని సర్టిఫికెట్. అయితే నీకోపని చెప్తానుండు కాని ఈవిషయం నాన్నకేమాత్రం తెలిసినా, చివాళ్లు చెప్పుదెబ్బలూ రంగరించి మననెత్తిమీద రుద్ది తలంటేస్తాడు !-

చెవ : బుర్ర బద్దలు కొట్టినా ముక్క పైకి రానిస్తానాండీ! హూ! అసలు మూగాడిలా కూచుంటాను

జ్యోతి: మరి, నువ్వు కాబూలీవాడిలా మాట్లాడ గలవురా?

చెవ : (సిగ్గుపడి, నవ్వుతూ) మా ఇంటిది దివాలా కాబూలీ వాడికూతురే కదండిమరీ!

జ్యోతి: (చిటికేసి) భేష్!- చెవలయ్యా, ఈ రాత్రికి ఇంటికెళ్ళ కూడదు. అసలు ప్లాను చెబుతాను. దగ్గరగా రండి! (అంతా ఓ చోటికి గుమిగూడతారు.)

తెర



## మూడవ రంగం

[గండభేరుండం హడావుడిగా, తనవాలుగదిలో పచార్లుచేస్తూంటాడు మనిషి. అరుర్దాగా కనిపిస్తాడు.]

గండ: నిన్నసాయంకాలం అనగా మాయమయ్యాడు. వీళ్లు, ఇప్పటికింకా అతీ గతీ లేరాయిరి, ఏం చెయ్యాను ? కోపంవచ్చే లేచిపోయాడందాం అనుకుంటే అసలు మావాడు కోపంపేరైనా విని ఎరుగడు. మీాకు తెలియదుకాని, వాడికి నేనెంత అంటే అంతే ! నేను గట్టిగా కళ్ళురజేసి 'ఆ !' అన్నానా, తక్షణంకా ర్తీక దీపంలాగ బితుకు బితుకు మంటూ నిలబడి పోతాడు. పిచ్చికుంక ! అన్నట్లు ఈముక్క మళ్ళీ ఎక్కడా అన కండి. వింటే మరీ ప్రేటేగి పోతాడు, (వీధిలోంచి, 'అయ్యో, అయ్యో' అని ఏడుపు) అయ్యో, ఎవరా ఏడుపు ? ఆ ! మా చెవలయ్య కంఠంలాఉందేమిటి!- అదుగో, వాడే !

[చెవలయ్య గొల్లుమని ఏడుస్తూ పరిగెత్తుగుంటూ వచ్చి, గండభేరుం డాన్ని తప్పించుగుని ముందుకుపోయి, వెతుకు తున్నట్టు తిరుగుతూ]

చెవ : మా అయ్యగారేరీ !- (గుండెలు బాదుకుంటు) బాబోయ్, ఇంకేమి చెయ్యను.

గండ: (హడలిపోయి) ఏరా, చెవలయ్య !-

చెవ : (ఆయనకేసి చూడకుండా) నా కెక్కడా కనపట్టం లేదే, ఆయన. ఏంచెయ్యనూ!- (గండభేరుండాన్ని

ఓరగా చూసి, నవ్వాపుగోని, గొల్లుమని ఏడుస్తూ)
ఈ ఘోరవార్త ఆయన చెవుల్లో ఎల్లా పడయ్యేను.

గండ: (భయంతో, చూస్తూ) ఇక్కడే ఉన్నానురా. నేనూ! ఏమిట్రా సంగతి ?-

చెవ : (గండభేరుండం కేసి తిరిగి) అమ్మోయ్య !- ఇక్కడే ఉన్నారా బాబూ ?- చూశారా. తెగ ఏడ్చాప్ప డికి కళ్ళకి చత్వారం వచ్చి మనుషులు కనపట్టం లేదు.

గండ: ఏడుపెందుకురా ?-

చెవ : ఏడవక ఏం చెయ్యమంటడి, బాబూ !- (శోసుగొట్టి నట్లు ఏడుస్తూ) అయ్యగారోయి !-అయ్యగారూ!-

గండ: (చలిమిడి అయిపోయి, బిక్క మొహంతో) ఏమయిం దిరా, చెవటయ్యా, చెప్పరా !

చెవ : (ఏడుపు దిగమింగి) ఈవార్త వింటే మీరు గుండె పగిలి చచ్చిపోతారు.

గండ: ఏ వార్తరా ! అయ్ ?

చెవ : నాకు తెలుసునండీ, మీరు ప్రాణాలు కాసినీ వది లేస్తారనీ, అయ్యో ! (ఏడుస్తాడు)

గండ: వదలనురా, -! నన్ను చంపక చెప్పరా, బాబు !

చెవ : దేముడా!- (గుండెలు కొట్టుకుంటూ) గండభేరుండం పంతులుగారికి ఈ ముసలితనంలో ఎంత కష్టం తెచ్చి పెట్టావురా, నాయనా !-

కండ: (కుళాయి నొక్కినట్లు ఏడుస్తూ) ఇంకేమి చెయ్యను రోయి, చెవలయ్యోయి! (చతికిలబడతాడు)

చెవ: (నాలిక్కరచుకొని, కనుబొమ్మలు ఎగరేసి, రహస్యంగా ఇకిలించి తనలో) పడిపోతున్నాడు, ముసిలాడు! (పైకి, ఏడుస్తూ) ఊరుకోండి. బాబుగారు, ఏంజేస్తాం!- మనకి ఋణంలేదు, అంతే!

కండ: (ఏడుపు ఆపి, అనుమానంగా చూస్తూ) ఋణంలేదూ?- (కోపంగా) అసలు సంగతేమిటో చెప్పి, ఏడవరా, నీ ఏడుపు అంటించా!

చెవ: మన అబ్బాయిగారు-

కండ: (ఆదుర్దాగా) ఊఁ!

చెవ: (ఏడుస్తూ) నేచెప్పలేనండీ! (ఏడుపుఆపి) మీరు ప్రాణాలు వదిలేస్తోంటే ఎల్లా చూడగల్నండీ? ఈ దుఃఖవార్త చెప్పడానికి నాది నాలికా తాటిబండా? దేముడా! అసలు ఈనాలిక కాస్తా తెగ్గోసి పట్టుకుపోకాస్త బాధేనా తగ్గుతుంది అని కళ్ళుమూసుకుని, నాలికజూపి, చీత్తాడు)

కండ: (బిక్కమొహంతో) అయ్యో ఏమయ్యాడా, వాడూ? చిచ్చుబుడ్డిలా అల్లా చీత్తావేమిట్రా అస్తమానూను, చెప్పరా, చెవలయ్యా!

చెవ: (ఏడుపు ఆపి) మనం బతిగున్నరోజుల్లో ఎంత కులాసాగా ఉండేవాళ్ళమండీ!- అయ్యో!

కండ: (ఏడుస్తూ) అదేమిట్రా, మనం బతికిలేమురా, ఇప్పుడు మరీ!

చెవ : ఇంకెక్కడి బ్రతుకండోయి ! ఈపాటికప్పుడే జ్యోతి గారిని తాళ్ళతో కట్టేస్తుంటాకు ! నేనేంచెయ్యనూ ?

గండ: (కుసిళ్ళుతూ) సంగతేమిటో, చెప్పి ఏడవరా !- (కోపంతో) లేకపోతే చంపేస్తాను.

చెవ : అయ్యో ! (చీది, తాపీగా) నిన్న సాయంత్రమండీ!-

గండ: ఊఁ-

చెవ : మేమిద్దరం అల్లా ఊరవతలికి, షికారెళ్ళామండి !

గండ: వెధవ షికార్లు మీరూను, మీషికార్లకి నిప్పెట్టా !

చెవ : (మళ్ళీ ఏడుస్తు) అమ్మో ! ఆదారుణం చెప్పడానికి నాకు నోరురావటంలేదండీ !

గండ: (పళ్ళు బిగపెట్టి) ఏందారుణంరా, చెప్పరా !

చెవ : ఆయ-షికారెళ్ళి, అక్కడున్న కొండమీది కెళ్ళామండి.

గండ: కొండమీదికి తగులడి జారికిందపడ్డారా ?

చెవ : అబ్బే లేదండీ, మామూలుగా నే క్రిందికి దిగివచ్చేశామండి !

గండ : ఏడిసినట్లుంది, వెధవచెప్పడం నువ్వూనూ ! తరువాత ఏమయిందిరా ?

చెవ : కొండదిగి చీకటి పడుతోందని, గబగబావచ్చేస్తున్నామండి

గండ: (ఆదుర్దాగా) ఊఁ, ఊఁ !

చెవ : (విచారంగా మొహంపెట్టి) అప్పడికింకా ఆకాశం లోకి చంద్రుడు రాలేదండి !

కండ: (విసుగ్గా) పోనీరా, దిక్కుమాలిన చంద్రుడు,ఇప్పుడు ఆ సంగతి ఎవడడిగాడురా, డొంకతిరుగుడు సన్యాసి చివరికేం జరిగిందిరా ?

చెవ : అయ్య!- ఇ తలో మా వెనకనుంచి రంయిమ టూ ఓ పెద్దకారు ఒకటి చక్కావచ్చిందండి !

కండ: ఊ!-అసలు నువ్వోగుడ్డి పీనుగువి. దిక్కుమాలిన చచ్చినాడ! (చెవలయ్య వీపుమీద కొట్టి) దొడ్డికాళ్ళ నడకా నువ్వూనూ ! మీ ఇద్దరిమీంచి ఆ కారు కాస్తా చక్కాపోయింది గావును.

చెవ : (ఏడుస్తూ) లేదండీ! మేమే ఆ కారుమీద చక్కా పోయామండి !

కండ: ఎందుకు ?

చెవ : ఏమో నాకేం తెలుసునండీ ? ఆ కారులోంచి నలుగురు రాక్షసపీనుగులుదిగి- (గబుక్కుని చేతులు ఆయన మీదికిజాపి) తుపాకులు బారెట్టి-

కండ: (హడలిపోయి) ఆ!-

చెవ : మమ్మల్నిద్దర్నీ అటుక్కుని పట్టేసుగుని కట్టగట్టి కార్లో పారేసి తీసుగుపోయారండీ !

కండ: (గుండెలు బాదుకుంటూ) ఎంతపని జరిగింది! వాడేడీ, మరీ !

చెవ : అబ్బాయిగార్ని కొండమీదచెట్టుకి కట్టేసి, నన్ను మీదగ్గరికి పొమ్మన్నారండి,

కండ: ఎందుకు ?

చెవ : పదివేలరూపాయిలిస్తే అబ్బాయిగార్ని ఒదుల్తార్టండి
లేకపోతే రెండు గంటల్లో- (గొల్లుమని ఏడుస్తాడు)

గండ: (కంగారుగా) రెండు గంటల్లో-ఏమిటిరా ?

చెవ : జోడుగుళ్ళ తుపాకీతో కాల్చేసి, చంపేస్తామన్నారండీ ! అయ్యో, జ్యోతిగారోయి !

గండ: అరె, వీళ్ళని కిరసనాయిలోసి అంటించా ! వీళ్ళ కొంపలు కాల్చి మసిచేస్తాను!

చెవ : వాళ్ళకి కొంపల్లేవండి !

గండ: పోనీ కారుందికదురా, డ్రాపీ! అది తగలెట్టేస్తాను.

చెవ : కారూ కనబట్టం లేదండి.

గండ : ఏమయింది?- మరి. నువ్వెల్లా వచ్చావు ?

చెవ : (ఏడుపు మొహంతో) నన్ను నడిచి పొమ్మన్నారండి ! (తనలో) ఎన్ని దిక్కుమాలిన ఆలోచనలున్నాయి. ఈ ముసిలాయన బుర్రలో ! (పైకి) ఆయన మీకొడుకని, నేను మీనౌకర్ననీ వాళ్ళకి తెలుసునండీ ! మీదగ్గిర చాలా డబ్బుందని కూడా విన్నార్ట, వాళ్లు.

గండ: (ఏ తోచక) నాదగ్గిరడబ్బులేదని చెప్పకపోయావుట్రా మరీ !

చెవ : (బుర్రఊపుతు) చెప్పానండి !

గండ: (ఆశగాచూస్తు) అప్పుడేమన్నారు వాళ్లు ?-

చెవ : వాడెవడో లావుగా, నల్లగా తుమ్మ మొద్దులాఉన్నాడండి. మొహామంతా మీసాలే వాడికి !

గండ: అబ్బ వెధవ మీసాలు !-ఏమన్నాడ్రా, వాడూ ?

చెవ : ఆమీసాలాయనేనా డీ!-దగ్గిరికి రమ్మని, ముప్పయి రెండుపళ్ళు గొంతుకులోకి పోయేలాగ గూబలుమూ డ్చేసి నోరుముయ్యమన్నాడండి ! ఏడుస్తూగూబ తడుముకుంటాడు)

గండ: (కోపంగా) అసలు వీళ్ళు మనుషులా జంతువులా ?

చెవ : ఆసంగతికనుక్కోడం మర్చిపోయానుగానండీ, పాపం నేవచ్చేటప్పుడు జ్యోతిగార్ని ఎల్లాక్కొట్టేస్తున్నారను కున్నారూ ?

గండ: అయ్యో!- మరి నువ్వుచూస్తూ ఊరుకొన్నావుట్రా, స్వామిద్రోహీ !

చెవ : వాళ్లు, ఆమీసాల ఆసామీతోసహా, నలుగురున్నా రండీ, ఏంచెయ్యను ? అప్పటికీ చిక్కటి ధైర్యంతో తిరగపడ్డాప్పటికీ (ఏడుస్తూ) నలుగురూ కలిసి నా వొళ్ళంతాకుమ్మి పచ్చడి చేసేశారండీ !- అమ్మ అమ్మా !- నావొంట్లో పది పన్నెండు ఎముకలు తప తపా విరిగిపోయాయని నా అనుమానం !

గండ : ఊరుకో చెవలయ్యా, వూరుకో! వీళ్ళరోగం ఈగండ భేరుండం కుదురుస్తాడులే. నేనుతక్షణం వెళ్ళి పోలీసు వాళ్ళని తీసుగొస్తానుండు, అంతాకలిసి అక్కడికెళ్ళి వాళ్ళని చీరి ఎండేద్దాం.

చెవ : ఆపనిమాత్రం చెయ్యకండి, బాబూ !

గండ: ఏమి ?

చెవ : ఏమిటండీ, ప్రతిదానికి చెప్పలేక చస్తున్నాను పోలీసు వాళ్ళు కనుచూపుమేరలో కనిపించగానే అబ్బాయి గార్ని కాల్చేసి పారిపోతామన్నారండి. (నిట్టూర్చి) ఈపాటి ప్పుడే తుపాకులూ అవీ తీడుస్తూంటారను కుంటాను. జ్యోతిగారూ! మీనాన్నగారు త్వరగా రాకట లేదని, ఏడుస్తున్నారా? ఏడవకండి, బాబూ! ఏంచేస్తాం, మీరింతే పెట్టి పుట్టారు. తీరిపోయింది.

Kంద: అబ్బ, కాస్సేపు ఊరుకోరా! ఉన్నమతి కాస్త కంగారెట్టి చెడకొడతా వేమిట్రా, నువ్వు?- పోనీ పోలీసు వాళ్ళని మామూలు ఖట్టల్తో తీసుగెడితే?

చెవ : కాల్చిపారేస్తామన్నారండీ!- అబ్బా!- అసలు మనిద్దరి శరీరాలుతప్ప మూడో శరీరంకనుపిస్తేచాలు అబ్బాయి గార్ని ఒక దెబ్బతో-

K ద: మనం కనిపించద్దూ వాళ్ళకీ?

చెవ : వాళ్లు కొండమీద కదండీ, తగులడత? అంచేత కింద నించి పైకెకుతున్న మనం వాళ్ళకి, కనపడ మరీ? Kంద భేరుండ గారూ! మీ ప్రశ్నల్లో నన్ను చంపకండి, మీ ఇష్టం అవుతె వెళ్ళండి, లేకపోతె లేదు. ఈ పాటే కప్పుడే తుపాకుల్లో గుళ్ళెక్కిస్తారను కుంటాను. ప్చ్! ఏం లాభం?- మీకింత పాపాణపు తండ్రి దొరికాడేమండీ, జ్యోతిగారూ! ఒక్కతుపాకీ దెబ్బతో మీరూ, మీ యవ్వనం, మీ అందం, మీ

సిలుకుచొక్కా—అంతా నశించిపో వలసిందే గదా!

(ఏడుస్తాడు)

కండ: అబ్బ, కాస్సేపు ఏడవకురా! ఇల్లారా, చెవలయ్యా! వాళ్ళెంత అడుగుతా, వందరూపాయలా?

చెవ: (తనలో) మరే రమ్మన్నారు తిమ్మన్నబంతికి, (పైకి) వ దకాదండీ, బాబూ! పది వేలు!

కండ: అబ్బా!— నువ్వు తిన్నగా వినుపించు గున్నావురా, వందేమో;

చెవ: బాగా నేఉంది. (ఏడుస్తూ) కొండది గేదాకా తంతూ చెబుతూనేఉన్నారు పదివేలని. పైగా చీటిమీద కూడా వేసి పంపారు. ఇదిగో, (ఇస్తాడు)

కండ: (పరీక్షించి, చూసి) అసలు మీరు పికారుకి ఎందుకురా, తగులడత? వెధవపికార్లూ మీరూనూ, పేకోజీ పెళ్లిల్లా ఇంట్లోకూచుంటే తీరిపోనా?

చెవ: జరిగిందానికి ఏమనుకుంటే, ఏంలాభం? పాపం జ్యోతి గారిని ఈపాటికి చెట్టుకి కట్టేస్తారనుకుంటాను.

కండ: (భయంగా) ఓరేయి, చెవలయ్యా,

చెవ: (వినిపించుగోకుండా) ఇంక గంటే ఉంట... నన్ను తిట్టుగుందున్నారా, అబ్బాయిగారూ; ఇదుగో ఏం చెయ్యను? కొడుకు ప్రాణాలు జారిపోతున్నా రూపాయలు లెక్కెట్టుగునే పిశినారి తండ్రి దొరికాడు, తీరిపోయింది.

కండ: అబ్బబ్బ; ఊండరా, చెవలయ్యా; ఆపరా, వాళ్కి-యి ఎంతరా వాళ్ళడుగుత? నలుగురైదుగురుతో చెప్ప డానికైనా వీల్లేకుండా, కంగారెట్టి చంపేస్తున్నా వురా, నన్ను,

చెవ : చెబుతూ కూడుంటే బైము కాస్తా మించిపోతుంది అప్పుడు ఏంచిచారించి ఏంలాభం? పదివేలూత్వరగా పట్టండి. వెళ్ళి విడిపించుగొద్దాం. లేకపోతే నిండు ప్రాణాలు గిలగిలాతన్నుకని జారిపోతాయి.

కండ: అసలు కొండెక్కదాంరమ్మని వాణ్ణి లాక్కెళ్ళింది, నువ్వేనా? ఊఁ?- (వీపుమీదకొట్టి) కొండముచ్చు పీనుగ ! నేదమ్మిడీ ఇవ్వను, ఇవ్వనంటే ఇవ్వను !

చెవ : (తనలో మళ్ళీ మొదటికొచ్చాడు. ఈముసిలాడు ఏం దారి ? (పైకి ఏడుస్తూ) అయ్యో ! జ్యోతిగారో బు, మీాకెత కష్టం వచ్చిందండీ. ఈపాటికి మీారు వాళ్ళ కాళ్ళమీాదపడి, రాళ్ళు కరిగేలా ఏడుస్తూంటారు. నాకు తెలుసు ! వాళ్ళు ఒక్కదెబ్బలోనే ప్రాణాలు తీసేస్తారట, పోనీ మీాఆత్మశాంతి కోసమేనా దేవుణ్ణి ప్రార్థిస్తాను (అని చేతులు జోడించి మోకాళ్ళమీాద కూచుంటాడు)

కండ: (ఏంతో చక, మతిమళ్ళించుగుని) ఒరేయి, చెవలయ్యా లేవరా, తప్పురా-శుంఠ ! నేను లోపలికెళ్ళి డబ్బు తీసుగొస్తాను. నువ్వు సిద్ధంగా ఉండు ! (విచారంతో తూలుకుంటూ లోపలి కెడతాడు.)

చెవ : హమ్మయ్య ! ఎంతనాటకం ఆడవలసి వచ్చింది. ఈ ముసలాయన్ని టోపీలోకి లాగేటప్పటికి ! నాతిల ప్రాణం తోకొచ్చింది.

కండ: (సంచితో ప్రవేశిస్తూ) నడవరా, శనీ ! నడు !

చెవ : అన్నీ వున్నాయండీ! లేకపోతే మనిద్దర్నీ కూడా చంపి పాతేస్తారు.

కండ: లెక్కెట్టుకుంటేగాని వస్త్రలేమిట్రా పోరి, వీళ్ళకి చేతబడి చేయించ! అల్లాఅనుకూనమేసే మిగతాసహం లోపలి జోబులో పెట్టాను.

చెవ : తాంబూలం అంతా ఒమూటి స్తే నే మంచిదండి !

కండ: వెధవ్వ కబుర్లు చెబుతావు నీకే ? అసలు మీారు కొండెందుకె క్కార్రా, కొండసన్యాసులారా !

చెవ : దారిలో మళ్ళీ చెబుతాను. ప్రస్తుతం ఆక్కండా నడవండి.

(కండభేరుండం విచారంగాను, చెవలయ్య హాయిగాను, వీధులో కెడతారు)

తెర



# నాలుగవ రంగం

[జలపాతం ఇంట్లో హాలు గది, జలపాతం ఓకుర్చీలో కూచుని పేపరు చదువుతుంటూంటాడు. ఇంకా రెండు కుర్చీలూ ఒక డ్రాయరు ఉంటాయి. చెవలయ్య కాబూలీవాడి వేషంలో ప్రవేశిస్తాడు.]

చెవ : (నవ్వి) నమస్కారమ్లు డీ- జల్ పాతంగారూ !

జల : రండి, దయచేయండి ఎవరండీ, మీరు ?-

చెవ : మేరం మర్ మురాల్ ఖాన్ అంటారూ అండీ !

జల : ఏం పనిమీాద వచ్చారు ?

చెవ : ఆ, హేమీా లేద్, సార్ !- మీాకీ ఆ గండభేరుండానికి షాదే సెప్తారని ఖబర్ తెల్సింది !-

జల : నాకూ గండభేరుండానికీ పెళ్ళేమిటి, మీాతలకాయి ! మా అమ్మాయిని వాళ్ళ అబ్బాయికి ఇస్తున్నాం !

చెవ : అదేనండీ ! ఆ మురుగన్ మాకీ దోస్తు !- ఇద్దర్ ముగ్గుర్కి పదివేలుదాకా బాకీ ఉన్నాడ్. నాల్గు హేళ్ళనుంచీ ఝూటామాట చెప్పి దగాచేస్తున్నాడ్ ! మీారు షాదీకి పదిహేలూ కట్నం ఇస్తారని తెల్సింది. అది ఠీకైన మాటేనాండీ ?

జల : ఏమిటేమిటీ?-గండభేరుండంగారు జమీాందారు, కదూ

చెవ : (చప్పరించి) ఆ హేమ్‌జమీాందారు, సాబ్ ! దివాళా జమీాందార్, ఆడ్కిమనం ఇరవై హేళ్ళబట్టిఎర్గుదుం మీారు కట్నం ఇచ్చేటప్పుడు ఉండి చూశారూ, మా ఖబర్ చేయించండి దేముడు మీాకే మేలు చేస్తాడ్, మేం వచ్చి డబ్బు తీస్కుంటాం, బస్ ?

జల : ఎంత లుచ్చా కండభేరుండం? కనపణ్ణీ చెబుతాను. అసలు మా అమ్మాయిని వాళ్ళ అబ్బాయికి ఇవ్వనే ఇవ్వను. మీరు వెళ్ళండి.

చెవ : అదేమ్టండీ?-మాకీమూలాసీషాదీనై అంటారూ. లేదూ!

జల : చాల్చాలు. ఇప్పుడేనా చెప్పారు వెళ్ళండి. మీకు తెగ నమస్కారాలు.

చెవ : వరే, వెళ్ళివస్తాను-జాల్ పాతంగారూ! దయూం ఉంచండి షాదీకి కబర్ తప్పక సేయించండి. మర్ మరాల్ ఖాన్ బంగ్లా బజార్ మే హా దర్కి తెల్సు (వెళ్ళడానికి లేస్తాడు)

కండ: (ప్రవేశిస్తూ) జలపాతం బావగారూ! ఈ సంగతి విన్నారా?

చెవ : (కంగారుపడి సర్దుకొని) నమస్కారమూ, కండభేరుండం గారూ! మని. గాప్కంఉంది, లేదూఅండీ!

కండ: (ఆగి, తనలో) నేనెప్పుడూ చూళ్ళేదేవిణ్ణి! బహుశా జలపాతంగారి స్నేహితుడై ఉంటాడు. జ్ఞాపకం లేదంటె మర్యాదగా ఉండదు (పైకి) అయ్యో! జ్ఞాపకం లేకేం? బాగా నేఉంది. (ఇంకే మనాలో తోచక) అప్పటికంటే చిక్కిపోయారు సుమాండీ! (నవ్వుతాడు)

చెవ : (నవ్వి) అయితే, వెళ్ళివస్తామ్! (వెళ్ళిపోతాడు)

కండ: సరేగాని, బావగారూ!- మా వాణ్ణి దొంగ లేత్తుకు పోయారు, విన్నారా? పదివేలిచ్చి పొద్దున్నే విడిపించుకొచ్చాను.

జల : బాగానే ఉంది గాని, మీరు ఈ కాబూలీవాణ్ణి ఎరుగుదురా?

కండ: అమ్మో, ఎరక్కేం! (నవ్వి) ఎద్దో!-

జల : వాడిక్కడికి వచ్చాడేమో అని తెల్లబోతున్నారుకదూ మీరింత ద్రోహులనుకోలేదు.

కండ: (ఆశ్చర్యపడి-తమాయించుకుని) బావగారూ ఏమిటి మీరనేది?

జల : ఛీఛి!- నాతో మాట్లాడకండి.

కండ: (కోపంగా నవ్వుతూ) మీవాగుడు మీ మొహంలా ఉంది!

జల : మీవాగుడు అంతకన్న అర్థాన్నంగా ఉంది.

కండ: ఏమండోయి. మాటలు తిన్నగా రానియ్యండి, ఏమిటీ పాడుకూతలూ మీరూనూ? మంచీ మర్యాదా లేదూ?

జల : ఇక్కడనుంచి మర్యాదగా వెళ్ళిపోండి. కోపంవస్తే నే మనిషిగాను.

కండ: (ధుమధుమలాడుతూ) అల్లాగా, కోపం రాకపోయినా నేను మనిషినిగాను, తెలుసా?

జల : మీ సంగతి నాకెప్పుడో తెలిసింది.

కండ: మీ సంగతి నాకు అంతకుముందే తెలిసింది.

జల : మా అమ్మాయిని ఛస్తే మీఇంట్లో పడెయ్యను.

కండ: (హేళనగా) పట్టిగెళ్ళు పోసి ఏరోడ్డుమీదన్నా పారెయ్యండి. ఎవడికావాలి!- చంపట-చంప!

జల : (కోపంతో) ఛీ పొండి!-

కండ: (తెగకోపంతో) ఛా పోతున్నాను! కండభేరుండం విసురుగా వెళ్ళిపోతాడు)

తెర

# ఐదవ రంగం

[కండభేరుండం ఇంట్లో హాలు గది. కండభేరుండం సుడిగాలిలాగ పచార్లు చేస్తుంటాడు. జ్యోతి చెవలయ్య చెరోవైపు నిలబడి ఉంటారు.]

కండ: బిళ్ళకుడుముల్లాంటివి పదివేల రూపాయలూ గంగ పాలయ్యాయి దేనికైనా అదృష్టం ఉండద్దూ ?

చెవ : మరేనండి! బంగారపుబొమ్మ ఆజలపాతం కూతురు-

కండ: నోర్ముయ్యి చెవలయ్యా! ఆపేరు నాదగ్గిర ఎత్తకు,

చెవ : (జ్యోతి కేసిచూసి, రహస్యంగానవ్వి) అదేనండీ, ఆయన కూతురు చంపగారు !-

కండ: చంపా లేదు. దవడా లేదు. పిశార్లు కట్టిపెట్టి నోరు మూసుగొని ఇంట్లోపడి ఉండండి. పౌడుం బిరడాల్లాగ మొహాలు మీరూనూ! ఈసారి పదివేలు కాదు రోలీ ఇవ్వను

చెవ : (నాలిక ఆడించి) అబ్బే, ఇంకక్కర్లేదండి.

జ్యోతి: నోరు మూసుగోమని ఓమాటు చెప్పారా నాన్న గారు !- గడ్డిబుర్ర సన్యాసి ! (అని రహస్యంగా నవ్వుతూ ధారాళంగా చెవలయ్య వీపు మోగిస్తాడు)

కండ: అల్లా గడ్డెట్టు పీకుక్కో ! అంతా పీడి మూలాన్నే వచ్చింది.

రామం: (ప్రవేశిస్తూ) నమస్కారమండీ మామగారు !

కండ: ఎందుకొచ్చిన నమస్కారాలోయ్! ఇదివరకోమాటు చెప్పానుగా, పెళ్ళి సంబంధం గురించి పదివేలకి కానీ తక్కువైనా నాతో మాటాడక్కర్లేదు. అదుగో ఆ

నందికేశ్వరుడుగారు, అడిగినకట్నం ఇస్తానన్నారు. ఇప్పుడే ఒప్పుకొచ్చాను.

చెవ : ఇందాక ఆయన ఇట్లో లేరన్నారుకదండీ ?

గండ: (చెవలయ్యకేసి ఉరుముతూ చూసి, సన్నంగా నవ్వి) ఇప్పుడే మళ్ళీ కలుసుకున్నానులే, పిచ్చిసన్యాసి! సరేగాని, చెవలయ్యా!- (ప్రేమతో) ఇల్లా రామ్మా!

చెవ : (పొంగిపోయి) ఆయ్ !-

గండ: (కపటనవ్వుతో) మనదొడ్లో నుయ్యుంది, చూశావా చాలాలోతుగా చల్లగా వుంటుంది !-

చెవ : (బిగుసుకుపోయి) ఎందుకండి !-

గండ: అబ్బే కాసేపున్నాక నిన్ను తీసుగెళ్ళి అందులో దింపుదామని !-

చెవ : నేను చాలా మంచివాణ్ణి డీ !-

గండ: (చెవలయ్యని వీపుమీదకొట్టి) నీతలకాయ !- మళ్ళీ నోరెత్తు చెబుతాను. ఫో లోపలికి-(చెవలయ్య ఒక్క దూకుతో పరిగెడతాడు) ఇదిగో రామం !- నువ్వు వచ్చినదారినే పెంద్రాళే వెళ్ళిపోతే మంచిది నాకు బోల్డు పనుంది.

రామం: నేనూ ఆ కట్నం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నానని మనవి చెయ్యటానికే వచ్చానండి!- దూరపు వారసత్వంవల్ల కొంత ఆస్తి కలిసింది—

గండ: (మొహంచాటంత చేసుకునినవ్వుతూ) అల్లాగటోయి!- నేను అప్పుడే అనుకున్నానుస్మీ !- మా వాడికీ మీ

లతకీ ఘటన వుందనీ! రా, రా, ఇల్లా కూర్చో!
(తియ్యగా చూస్తూ) కాసిని మంచినీళ్ళు పుచ్చు
కుంటావా?-

రామం: అక్కర్లేదండి. పైగా మీకు జోల్లు పనుందన్నారు.

గండ: (నాలిక ఆడించి) దానికేం? తరువాత చూసుకుంటా
నులే. ఊ, ఊ!-

రామం: మా పూర్వులు అసలు అంతో ఇంతో వున్నవాళ్ళే
నండి, ఏదో పరిస్థితులు బాగుండక ప్రస్తుతం మేం
ఇలా వుండవలసొచ్చింది.

గండ: బాగా నేవుంది. మీవంశం పేరు ప్రతిష్టలు, అవీ, ఊ,
నే ఎరుగనటోయి! లత సలక్షణమైన పిల్ల! లతకేం
ముత్యాలమూట.

రామం: ఏదో పెద్దలు మీరు పూనుకుని ఈ పెళ్ళి చేయిం
చాలి.

గండ: అయ్యో, బాగా నేవుంది. (ఆరిందాగా) అంతకన్న
నా కా్కవలసింది ఏముందోయ్, వెఱ్ఱివాడ!- మీ
చెల్లెల్ని మావాడికి చేసుగోడం తథ్యం. ఊ! పైగా
శుభస్య శీఘ్రంఅన్నారు, ఇంకోవారంలో ముహూర్తా
లున్నాయట, ఏమంటావు?-

రామం: అంతకన్న నాకుమాత్రం కావలసిం దేముందండి.
(జేబులోంచి సంచితీసి) ఇదిగో, తెలుగు విశ్వవిద్యాలయ
పదివేల రూపాయలూ!-

గండ: (ఆశ్చర్యంతో కళ్ళు మిటకరించి) ఆ!- అప్పుడే ఏం తొందరొచ్చిందోయి, వెర్రివాడ ! (మెడ ఆడిస్తూ) అసలు నిన్ను చూస్తే నాకెంత ప్రేమ అనుకున్నావు.

రామం: నా మాట మన్నించి, ఇది మీ దగ్గిర వుంచాలి

గండ: (తెగనవ్వి). ఏమిటో. నీకు మరీ చాదస్తమోయి !- నీ అంత మంచివాడు ఈ భూగోళం మీద లేడు !- కాసిని మంచినీళ్ళు పుచ్చుకున్నావు కాదు. గదా ఎక్కడ మొహమాటమోగాని !-

రామం: అబ్బే, వద్దండీ, మరి సెలవిపిస్తారా? నేను వెళ్ళి పెళ్లి ప్రయత్నాలు, అవీ......

గండ: ఊఁ, ఊఁ, శుభం, శుభం !-

(రామం వెళ్ళిపోతాడు)

గండ: మొత్తానికి మాట నెగ్గించుకుని గండభేరుండం కొడుకు ననిపించుకున్నావు, ఊఁ!- (నవ్వి, చిలిపిగా చూస్తూ) అవధానులు గారింటికి వెళ్ళి ముహూర్తం పెట్టించుకుని వస్తాను. (అని కఱ్ఱ వదిలేసి హడావుడిగా వెళ్ళిపోతాడు)

జ్యోతి: (గండభేరుండం వెళ్ళాక అవతల ఎదరికి తిరిగి) చెవలయ్యా !- చెవలయ్యా !-

చెవ : అయ్యా !- (ప్రవేశిస్తాడు)

జ్యోతి: (కుర్చీలో తాపీగా కూర్చుని) హామ్మయ్యా ఎంత శ్రమపడ్డామురా. ఈ పెళ్ళి ఖాయపర్చడానికి.

[గండభేరుండం హుందాపుడిగా వీధిలోంచి హాలులోకి వస్తాడు]

చెవ : (ఆయన్ని చూడకుండా) చిత్రం !- నా పెద ప్రశ్నలో మీనాన్నని టోపీలోకి లాగేటప్పటికి, మన తాతలంతా దిగొచ్చారండి !-

[ఆ ముక్క విని గండభేరుండం గబుక్కుని వెనక్కెళ్ళి నక్కి వింటాడు]

జ్యోతి: నిజంగా నను చంపేస్తున్నారంటే నమ్మద్రా ?

చెవ : (గర్వంగా) నమ్మడం ఏమిటండీ, నా ఏడుపు చూసి (అభినయిస్తూ) "ఇంకేం చెయ్యనురోయి, చెలమ్యోయి!" అంటూ చతికిలబడి మీనాన్న ఒకటే గోల !-

[గండభేరుండం ముక్కుమీద వేలేసుకుని, ఓ చెంబుడు మిరియాల కషాయం తాగినట్లు చూస్తాడు]

జ్యోతి: మొత్తానికి కథ రక్తి కట్టించినవాడవు నువ్వే ! కాని ఆరామం పదివేలు ఇస్తున్నప్పుడు, అది తనడబ్బే అని ఎక్కడే ఆనవాలు కడతాడో అని హడలి చచ్చాను (గండభేరుండం ఏడుపు మొహంతో నోరు తేలేస్తాడు.)

చెవ : (తేలిగ్గానవ్వి) అబ్బే ఆయనకి బుర్ర ఎదండీ, అసలూ? వుత్తగడ్డిబుర్ర ! (గండభేరుండం కోపంతో కర్రఝాడిస్తాడు) నేను మారువాడీవేషంలో జలపాతం ఇంటి దగ్గర ఎదురుపడ్డానా, మీనాన్న నన్ను గుర్తే పట్టలేదు ! (గండభేరుండం గుండెలు బాదుకుంటాడు.) నేను ఆయనదగ్గర కొండ, షికారు, కారు అంటూ

కథ అల్లేసి చెప్పానాండి, అదంతా నిజమనుకునిపంపు నొక్కినట్లు ఒకటే ఏడుపు, పిచ్చి ముసలాయన !

జ్యోతి: పాపం ! ఏంజెయ్యం, ఇల్లా నాటకం ఆడితేగాని లాభం లేకపోయింది.

గండ: (కోపంతో ఒణికిపోతూ, ఒక్కదూకుతో ముందర కొచ్చి) హోరి, రాక్షసపీనుగుల్లారా! ఇదా మీఎత్తు ? ఎంతమోసం ! ఏంఘోరం ! ఒరేయి చెవలయ్యా ! నక్క శనిపీనుగ ! నిన్ను చంపెయ్య, నాదగ్గి బుర్రరా ?

చెవ : (వొణికిపోతూ) అబ్బే మంచి బుర్రేనండి !

గండ: నోర్ముయ్యి, ద్రాపీ ! నీఏడుపు సంతకెళ్ళా ! మీరిద్దరూ కొండెక్కారా ?

చెవ : మరేనండి. అసలు డింగీమీద నావషికారు వెడదామనుకుంటే, డింగీ దొరక్క, కొండెక్కామండి !

గండ: నోరుముయ్యమన్నాను, గారడీపీనుగ ! ఎంత నమ్మించావురా నన్ను ! మావాణ్ణి దొంగలెత్తుకుపోయారా? నువ్వు ఏడుపా? పదివేలా?...ఊఁ, పైగా వాడి ఆత్మశాంతికి నువ్వు జపాలా ? నీ జపాలంటించా ! (చెవలయ్యని వీపుమీద కొడతాడు)

చెవ : (ఏడుస్తూ) హామ్మో, చచ్చానండోయ్ !

గండ: నన్నేడిపించి, పదివేలరూపాయలూ డిబ్బి దోచుకుని పోదామనే ! హోరి మహామ్మారి !

చెవ : నాకోసం కాదండీ, మీా అబ్బాయికోసమేనండి ! ఇల్లాంటి విషయాల్లోకి చివరికి అసలువాళ్లు బాగా నే ఉంటారు, మాబోటిగాళ్ళని కర్రీరకింద జమకట్టి బజాయిస్తారు - కొట్టి చంపెయ్యండి. అంతేనా ! (ఆకాశంలోకి చూస్తూ) అదుగో ! పుష్పకవిమానం వస్తోంది, హాయిగా స్వర్గంలోకి పోతాను) అని చేతు లెత్తి దణ్ణంపెడతూ కళ్లు మూసుకుంటాడు)

కండ: అయితే వెళ్ళు (అని కర్రెత్తి, చెవలయ్యని కొడ తాడు)

చెవ : హాయ్యో ! చచ్చేనండోయ్ ! అని కుంటు కుంటూ పరిగెడతాడు)

కండ: (జ్యోతికేసి తిరిగి) ఏరా లచ్చా ! నీ లక్క పిడత బుర్రలో ఎన్ని చచ్చు ఆలోచ స్లున్నాయిరా, కుంకాకీ ! నామసుద్ద పుచ్చుగాని కొడుకే తండ్రికి పంగనామాలు పెడుతూంటే, ఈ చెవలయ్యని అనేం లాభం ? ఛీ, ఛీ ! తక్షణం లేచిపో, ఈ ఇంట్లోంచి, రోడ్డుమీాద పోతున్న ఏ తలమాసిన మూగ శుంఠనో తెచ్చి వాణ్ణి పెంచుగుంటాను. తీరిపోతుంది.

జ్యోతి పెంచుకోండి, ఎవడొద్దన్నాడు ! నే నిప్పుడే పోతు న్నాను.

రామం: (హడావుడిగా ప్రవేశిస్తూ) జ్యోతీ!-ఏమిటా మాటలు ఉండు-నమస్కారం మామగారూ !

గండ: (కోపంగా సకిలించి) రావోయి, రా! ముస్తర్ని కూర్చోడు రా అన్నట్లుగ చచ్చు చెవలయ్యా, మాకుంకా ద్రాపిడి మధ్యా ముగ్గురూ కలిసి నన్ను టోపీలోకి లాగేసి మాయం చేద్దామనే మీ ప్లాను! ఎంత స్వామిద్రోహం! ఎంత కుతంత్రం! ఇదిగో నా కోపం చెలరేగక ముందే తొలగముడిచెయి. ఒళ్ళుచీరి ఎండయ్యగలను.

రామం: అయ్యా గండభేరుండంగారూ! మేం చేసిన ఈ క్షమించ రాని తప్పుకి, వచ్చేలా సిగ్గుపడుతున్నాం!

గండ: ఏడవ లేక పోయారు, పోదురూ! సిగ్గోటి మీ మొహాలకి.

రామం: అల్లా కాదు మ. మీరు క్షమించితీరాలి. పైగా అసలు మరో ముఖ్యవిషయం చెబుదామని వచ్చాను.

గండ: అబ్బో, నాకు చెప్పక్కర్లేదు. కావలిస్తే రోడ్డుమీదికి పోయి నీకు నువ్వే చెప్పుగో!

రామం: మీరు సావధానంగా వినాలి, మా అమ్మమ్మ చచ్చి పోయింది.

గండ: చస్తేనాకేం! బాగానేవుంది, పైగా ఇదోటా?— మొయ్యడానికి రమ్మనవు గదా?

రామం: మొన్ననే మోసేశాం లెండి. వారసత్వంరీత్యా ఆవిడ కున్న ఓ లక్షరూపాయల ఆస్తి మాకు సంక్రమించిం దండీ!—

గండ: ఏమిటేమిటి!

రాముం: మరేనండి !-ఆవిడకున్న జమీందారీ అంతా మాకు కలిసిందండి,

గండ: (బుర్ర అడ్డంగా ఆడిస్తూ) ఏమో నాకు నమ్మకం లేదు ! అసలు నీకు అమ్మమ్మ ఉందో లేదో నాకేం తెలుసు ?- పైగా జమీందారిణీ కూతల్లూ నువ్వూ ఇంటిదాక దాంసన్యం అంటూ నా దగ్గిరకొచ్చి, కాజేసిన పదివేలు, కట్నంకింద జమ కట్టుగోమని పట్టుగు చక్కా వచ్చావాయిరి. అసలు తిరిగి ఇచ్చినందుకు సంతోషం ! ప్రస్తుతం నువ్వావతలికి ఫో !-

రాముం: నన్ను నమ్మితేరాలి మీరు కావలిస్తే రుజువుకోసం ఇదిగో వుత్తరం. ఇంటికి వెళ్ళగానే వచ్చింది. ఆవిడకి మారసుణ్ణి నేనే నని. జమీందారీ తక్షణం వచ్చి చూసుగోమని ఆవిడ ప్లీడరుగారు స్వయంగా నాకు వుత్తరం రాశారు.

గండ: ఏదీ, చూడనీ ! (చదివి) నిజమెలావుం దేముటోయి !

రాముం: ప్రమాణపూర్వకంగా నిజమేనండీ.

గండ: ఏమిటీ ? (నవ్వుతూ) ఆ!-

రాముం: మరేనండి !

గండ: (తెగనవ్వి) నే అప్పుడే అనుకున్నానుస్మీ ! అబ్బే. నువ్వొక్కడోయి, నీ నిజాయితీ నాకు తెలియదూ ! దా, ఇలాకూర్చో !

రాముం: మీరు ఇల్లా నన్ను క్షమించి, గౌరవించినందువల్ల మీ హృదయం ఎంత విశాలమైందో బోధపడుతోంది

గండ: ఆ!-కుర్రాళ్ళయ్యాక ఇల్లాంటివి సామాన్యమే మరి,

రామం: నాకృతజ్ఞత ఎల్లా తెలపాలో తెలియక కొట్టు కుంటున్నాను...

గండ: (చిలిపిగానవ్వి, ఓరగా చూస్తూ) ఏమిటో! నీకు తెలియ దేమిటోయి!- వెఱ్ఱిమాటలూ నువ్వూను.

రామం: నేను మీఅబ్బాయికి ఇరవై వేలుకట్నం ఇయ్యదల్చు కున్నాను.

గండ: (నోరు తెరిచి) ఇరవై వేలే!-

రామం: అవునండి- ఏదో యథాశక్తి!-

గండ: (సంతోషంతో చేతులు తిప్పుతూ, రేకు చప్పుడు చేసినట్లు నవ్వుతూ) నిను ముద్దెట్టుకుందాం అని పిస్తోంది!

రామం: మరి మీఅబ్బాయి అభిప్రాయంకూడా...

గండ: వాడిమొహం!- చెట్టంత ముండావాణ్ణి నే ఉండగా వాడి అభిప్రాయ మేమిటోయి!-

రామం: అయినా అడగండి!-

గండ: సరే!- ఏరా, అబ్బీ!- (కళ్ళెగరేసి నవ్వుతూ) నీ కిష్ట మేగా!-

జ్యోతి: నాకిష్టంలేదు !- నేనా పెళ్ళి చేసుగోను!-

గండ: (కోపంగా నోరు తెరిచి) అయి!- (పోట్లగేదిలాచూస్తూ ఏంరోగం నీకు!-

జ్యోతి: (అయిష్టంగా) లతకు, లత!- పీతవాలకం అదీను.

కండ: ఎవడ్రా అల్లాఅన్న బుర్ర సూన్యపుసన్యాసి !- లత అందాలరాణి!- చందాల చిలక!-

జ్యోతి: లతకీ ఆరామంగాడికి కలిపి చిన్న మెత్తు బుర్ర లేదా యిరి, సెంటుభూమి లేదాయిరి, కానీ పలుకుబడి లేదాయిరి- వీళ్ళా మనకి దొరుకుత !

కండ: ఛీ! ఛీ! ఏంమాటలవీ ? (ఆలోచించి, గ్రహించినట్లు బుర్రవూపి, నవ్వుతూ) హోరి, టక్కులదాసూ !- వెనక నే అన్నమాటలు నామీదే రుద్దుతున్నావురా హు !- (అని నవ్వుతాడు. అందరూ నవ్వుతారు)

చెవ : (తొంగితొంగిచూస్తూ ప్రవేశించి) ఈపెళ్ళికుదరడం వల్ల మనవీపుకి కొంచెం పూజతగ్గుతుంది !-

కండ: (సంతోషంతో) నిన్ను పూర్తిగా క్షమించేశాను చెవ లయ్యా !

చెవ : (తేలిగ్గానవ్వి) మీరు చివరికి ఎల్లాగ క్షమిస్తారని నాకు తెలుసునండీ !-

జల : (ప్రవేశిస్తూ) నమస్కారమండీ, కండభేరుండం గారూ !-

కండ: (అనుమానిస్తూ) ఇదిగో !- ఏం ఇలావచ్చారు ?

జల : నన్ను క్షమించాలి !

కండ: (నవ్వుతూ) బాగానేఉంది. దానికేం !-

జల : చిత్తం!- మాఅమ్మాయి ఈరామాన్నితప్ప వేరొకర్ని కన్నెత్తిచూడనని భీష్మించుగుని కూచుంది పైగా

సత్యాగ్రహం కూడా ప్రారంభించడం వల్ల నేను ఒప్పుకో వలసివచ్చింది.

గండ: భేషుగ్గా వుంది. ఈ మన్మథుడులో ప్రస్తుతం కుబేరుడు గూడా తిష్ట వేసుకున్నాడు!-

జల : అంచేత సంబంధం ఒకటోరకంగా వుంది, ఇంకె రెండు పెళ్ళిళ్ళు ఒకమాటే చేయించేద్దాం.

జల : రెండేమిటి?-

చెవ : బాగానే వుంది. మరి. రెండు లేందే రంజేముంటుందండీ ?- మా అబ్బాయిగారికీ, లతమ్మగారికీ పెళ్ళి నిశ్చయం అయిపోయిందికదండీ, మరీ !

జల : అల్లాగా, శుభం !-

గండ: అయితే రెండు పెళ్ళిళ్ళు జోడించి మోగించేద్దాం.

జల : సంతోషంతో ఒప్పుకుంటున్నాను.

చెవ : (ఆనందంతో ఎగురుతూ) అయితే వాయించండోయ్ భజంత్రీలు!- (అని తనేవాయిస్తూ తిరుగుతుండగా, రామం జ్యోతి భుజాలమీద చేతులు వేసుకుని నవ్వుతూండగా, గండభేరుండం, జలపాతం చేతులు కలుపుకుని విరగబడుతూండగా)

తెర

—0—

శ్రీ రత్నా ప్రింటర్సు, రాజమండ్రి.